

# సెలవు రోజు వచ్చింది, సంతోషాన్ని తెచ్చింది!



## పెద్ద బబుల్‌ని ఎలా ఊదాలో తెలుసా మీకు ?









బబుల్ గమ్




బలే పెద్ద బబుల్...
బలే సులభం.

Trikaya-CP.11.84 RR

**Statement about ownership of CHANDAMAMA (Telugu) Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

1. *Place of Publication*
   'CHANDAMAMA BUILDINGS'
   188 N.S.K. Salai
   Vadapalani, Madras-600 026

2. *Periodicity of Publication*
   MONTHLY
   1st of each calendar month

3. *Printer's Name* B.V. REDDI

   *Nationality* INDIAN

   *Address*
   Prasad Process Private Limited
   188 N.S.K. Salai, Vadapalani
   Madras-600 026

4. *Publisher's Name*
   B. VISWANATHA REDDI

   *Nationality* INDIAN

   *Address*
   Chandamama Publications
   188 N.S.K. Salai, Vadapalani
   Madras-600 026

5. *Editor's Name* B. NAGI REDDI

   *Nationality* INDIAN

   *Address*
   Chandamama Buildings
   188 N.S.K. Salai, Vadapalani
   Madras-600 026

6. *Name & Address of individuals who own the paper*
   'CHANDAMAMA CHILDREN'S TRUST FUND

Beneficiaries:
1. B.V.L. ARATHI
2. B.V. SHARATH
3. B.N. RAJESH
4. B. ARCHANA
5. B.N.V. VISHNU PRASAD
6. B.L. ARADHANA
7. B. NAGI REDDI (JR)

All Minors, by Trustee, M. UTTAMA REDDI
14 V.O.C. Street, Madras-600 024

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

B. VISWANATHA REDDI
*Signature of the Publisher*

1st March 1985


# COME HOME TO HERITAGE




MARCH ISSUE
NOW ON STANDS

From the publishers of Chandamama






It's worth preserving. Every issue of it.

Single Copy Rs. 6.00
Annual Subscription Rs. 72.00

For subscriptions: DOLTON AGENCIES,
188 N.S.K. Salai, Vadapalani, Madras - 600 026



కచేరి నుంచి తిరిగి వస్తూండగా, ముసలి వాడు అక్కడే తినుబండారాల బుట్ట ముందు చతికిలబడి కూర్చుని వుండే వాడు. రోజంతా ఎండలో అలా కాలం గడిపే ముసలివాడంటే చైతన్యకు ఎంతో జాలికలిగేది.

అలా రోజూ కనిపించే ముసలివాడు, ఒకసారి వరసగా పది రోజులు కనిపించక పోయేసరికి, అతడు చచ్చిపోయాడేమో అనుకుని బాధపడ్డాడు చైతన్య. కాని, ఆ మర్నాడు ముసలివాడు తన మామూలు చోట తినుబండారాల బుట్ట ముందు కూర్చుని కనిపించేసరికి, చైతన్యకు చాలా ఆనందం కలిగింది.

అతను వీరయ్యను బండి ఆపమని, ముసలివాడి దగ్గరకు వెళ్ళి, "పది రోజులుగా కనిపించడం లేదేం, తాతా?" అని అడిగాడు.

తను ఎరగనివాడు యింత ఆప్యాయంగా పలకరించేసరికి, తాత తృప్తిగా తలాడించి, "బాబూ, రోజూ నేనిక్కడ కూర్చుని వుండటం చూస్తున్నావన్న మాట! నాకు యీ మధ్య జ్వరం. అన్నాళ్ళూ మూసినకన్ను తెరవలేదు." అన్నాడు దీనంగా.

చైతన్యకు అతని మీద మరింత జాలి కలిగి, "తాతా, యీ బుట్టలో వున్నవన్నీ అమ్ముడైపోతే ఎంత వస్తుంది?" అని అడిగాడు.

"నాలుగు రూపాయలు. అందులో రూపాయి లాభం." అన్నాడు ముసలివాడు.

"అలా అయితే, బుట్టలో వున్నవన్నీ నాకు యిచ్చెయ్యి. ఐదు రూపాయలిస్తాను," అన్నాడు చైతన్య.

ముసలివాడు ఆశ్చర్యపోయి చూస్తూ వుండగానే, చైతన్య బుట్టలో వున్నవన్నీ బండిలో పెట్టి, ముసలివాడికి ఐదు రూపాయలిచ్చి, బండిలో కూర్చున్నాడు.

వీరయ్య, చైతన్యతో, "యివన్నీ ఏం చేస్తారు, బాబూ?" అని అడిగాడు.



బాటకు ఒక పక్కగా భూమిలో గుచ్చుకు పోయింది. "సుబాహూ!" అంటూ చంద్రవర్మ పెద్దగా అరిచి గుర్రంమీద ముందుకు వాలి దాని మెడ మీదుగా కరుచుకు పడుకున్నాడు.

"ఇప్పటివరకూ నేను బతికేవున్నాను, యువరాజా!" అంటూ సుబాహుడు కూడా గుర్రం జూలు మీదికి వంగి తల వెనక్కు తిప్పి చూశాడు. శత్రు అశ్వికులలో ఒకడు విల్లంబు రెండు చేతులతో పట్టుకుని గురి చూస్తున్నాడు. గుర్రం కళ్ళెపు తాళ్ళను అతడు పళ్ళమధ్యగట్టిగా బిగించి పట్టుకున్నాడు. ఈ దృశ్యం సుబాహుడికి ఆశ్చర్యాన్ని, భయాన్ని కూడా కలిగించింది. కాని, అతడు చంద్రవర్మకు యీ సంగతి చెప్పబోయేంతలో ఆ అశ్వికుడి గుర్రం కాలు బాటలో వున్న ఒక రాతిముక్కకు తగిలి ఒక్క త్రుటి కాలం అది ఒక పక్కకు ఒరిగింది. అదేక్షణంలో వెనక వేగంగా వస్తున్న గుర్రాలలో ఒకటి దాన్ని బలంగా తాకింది. బాణం విల్లా పట్టివున్న సైనికుడు ఆ తాకిడికి గుర్రంమీదినుంచి నాలుగైదడుగుల ఎత్తున గాలిలోకి లేచి పెద్దగా అరుస్తూ కింద పడిపోయాడు. అతడ్ని నలగతొక్కుకుంటూ తక్కిన గుర్రాలు ముందుకు దూకినై.

సుబాహుడు ఆనందంతో ఎగిరి గుర్రం మీద నిటారుగా కూర్చున్నాడు. ఈ దెబ్బతో తక్కిన అశ్వికులు తమను వెంట తరమటం మాని, తమతోటి వాడికి సహాయం చేసేందుకు ఆగుతారని అతడు అనుకున్నాడు. కాని, అతడి ఆశ నిరాశ అయింది. శత్రు అశ్వికులు తమవాడి కోసం వెనుదిరిగైనా చూడకుండా గుర్రాలను వేగంగా పరిగెత్తిస్తున్నారు. కాని, వాళ్ళల్లో విల్లంబులు పట్టినవాడెవడూ లేనన్న సంగతి సుబాహుడికి ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది.

"యువరాజా! శత్రు అశ్వికుల్లో బాణాలు వదిలేవాడు, వాడి అనుచరుం

గుర్రాలను గట్టిగా అదిలించి పారిపో సాగారు.

శత్రువులను తప్పించుకుంటూ చంద్ర వర్మా, సుబాహుడూ దాదాపు ఒక గామడ దూరం నగరంకేసి వెళ్ళారు. హఠాత్తుగా వారికి నగరంవైపు నుంచి వస్తున్న కొందరు రౌతులు కనిపించారు. చంద్రవర్మ వాళ్లను చూస్తూనే తన గుర్రాన్ని అటు వెనక్కు తిప్పుతూ, "సుబాహూ! శత్రువుల ఎత్తుగడ అర్థమైందిగదా? ఇక మనం పారిపోవటమే ఉత్తమం. మనం యీ మధ్యదారి అందుకునే లోపల ఆ శత్రు దళాలు అంతా వచ్చి మనను చుట్టు ముట్టుతుంది," అన్నాడు.

చంద్రవర్మా, సుబాహులు తమ గుర్రాలను వెనక్కు తిప్పి పరిగెత్తించే లోపల శత్రు అశ్వికులు ముగ్గురు కూడా తమ తమ గుర్రాలను మళ్ళించి వాళ్ళవెంట పడ్డారు. క్రమక్రమంగా శత్రు అశ్వికులకూ, చంద్రవర్మా సుబాహులకూ మధ్య వున్న దూరం తగ్గుతున్నది.

"యువరాజా, మనమిద్దరమూ యీసారి నిజంగా పెద్ద ప్రమాదంలో చిక్కు కున్నాం," అన్నాడు సుబాహుడు పెద్దగా ఆయాసపడుతూ.

చంద్రవర్మ జవాబివ్వలేదు. తనను అనుసరించి రమ్మన్న సూచనగా అతను సుబాహుడికేసి చేయిమాత్రం చూపాడు. పారిపోతున్న వాళ్ళూ, తరుముకువస్తున్న వాళ్ళూ కూడా తాము ఎలాంటి మార్గాన వస్తున్నదీ గమనించటం లేదు. చూస్తూ వుండగానే వాళ్ళు దాటుకు దారువైపుగా వున్న పొదలూ, గుట్టలూ దాటి ఒక కొండ దారిన పడ్డారు.



చంద్రవర్మా, సుబాహుడూ ఎక్కిన గుర్రాలు బాగా డస్సిపోయినై. అవి యింకెంతసేపో తమను మోయలేవని చంద్రవర్మ గ్రహించాడు. అతని దృష్టి శత్రు అశ్వికులకేసి మళ్ళింది. వాళ్ళు ఎక్కిన గుర్రాలు కూడా రొప్పుతూ, నోటి వెంట నురుగులు కక్కుతున్నవి. అతని

దృష్టి కొండకు దిగువగా ప్రసరించింది. దాదాపు బాణం వేటు దూరంలో పది పన్నెండుమంది శత్రు అశ్వికులు తమ కేసి వస్తున్నారు.

"సుబాహూ, ఇక మనం ఈ గుర్రాలను నమ్ముకుని లాభం లేదు. అవి ఏ క్షణానయినా ప్రాణాలు వదలవచ్చు. మనం పాదచారులుగా పారిపోవటమే మంచిది." అంటూ చంద్రవర్మ గుర్రం మీదినుంచి దిగాడు. అతడి వెంటనే సుబాహుడు కూడా గుర్రం దిగాడు. అదే క్షణంలో శత్రు సైనికులు పెద్దగా కేకలు పెడుతూ తమ తమ గుర్రాల మీంచి దిగి, చంద్రవర్మ, సుబాహుల కేసి పరిగెత్తి రాసాగారు.

చంద్రవర్మ తన చుట్టూ ఒకసారి కలయ చూసి, కొండమీద ఏటవాలుగా వున్న ఒక ప్రదేశంకేసి పరిగెత్తి, అక్కడ వున్న రాళ్ళనూ, చిన్న చిన్న అడవి మొక్కలనూ పట్టుకుంటూ కిందికి దిగసాగాడు. సుబాహుడు కూడా అతణ్ణి అనుసరించాడు. ఇద్దరూ కొంత అగాధంలో వున్న దిగువ ప్రాంతంకేసి జాగ్రత్తగా పోతున్నంతలో, ఏటవాలుగా వున్న ప్రదేశం మీదికి పది పన్నెండు మంది శత్రు సైనికులు వచ్చారు.

వాళ్ళల్లో ఒకడు పెద్దగా గొంతెత్తి, "మనం వాళ్ళను అనుసరించి పోవటం ప్రమాదకరం. పట్టు తప్పితే కింద అగాధంలో వున్న నదిలో పడిపోతాం. ఇక్కడే వుండి వాళ్ళమీదకు రాళ్ళు దొర్లించండి." అని అరిచాడు. ఆ వెంటనే పెద్ద పెద్ద బండరాళ్ళు చంద్రవర్మ, సుబాహుల కేసి దొర్లిరాసాగినై.

ఆ సరికి చంద్రవర్మ, సుబాహుడూ అగాధం అంచుకు చేరారు. చంద్రవర్మ ఒక్కసారి పైనున్న శత్రు సైనికులకేసి చూసి, "సుబాహూ, ఇక మనకు మార్గాంతరం లేదు. నీకు ఈత వచ్చును గదా...." అంటూ అగాధం అంచున పొంగులు వారుతూ పారుతున్న నదిలోకి చెంగున దూకాడు. —(ఇంకావుంది)





# కవులపోటీ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎంతో శ్రమతో కూడిన యింత కఠిన కార్యానికి, నిన్నెవరు ప్రోత్సహించారో నాకు తెలియదు. కార్యసాఫల్యం తరవాత నీకు లభించబోయేదేమిటి? సంపదలా? కీర్తా? లేక యీ రెంటినీ ఆశిస్తున్నావా? ఒకే వ్యక్తి యీ రెండింటికీ అర్హుడు కావటం చాలా అరుదైన సంగతి. వివేకి అయినవాడు, ఈ రెంటిలో ఏ ఒకదాని కోసం మాత్రమే, తన యావచ్ఛక్తిని వినియోగిస్తాడు. అలా కానప్పుడు ఒక్కొక్కసారి వెలుగులో అవహేళన పాలు కావలసి వస్తుంది. అందుకు ఉదాహరణగా నీకు, యద్దేవు కవిపండితుల

## బేతాళ కథలు



కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను." అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు ప్రసన్నుడనే కవి, తన కవిత్వాన్ని వినిపించి రాజాశ్రయం సంపాదించాలని పాటలీపుత్ర నగరం చేరుకున్నాడు. అప్పుడు పాటలీపుత్రాన్నేలుతున్న మహారాజు సాహితీ ప్రియుడని పేరు.

ప్రసన్నుడు రాజదర్శనం కోసం ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కాని, రాజభటుల ఆటంకం కారణంగా అవన్నీ విఫలమయ్యాయి. అప్పుడతను, తన బాధను ఒక రత్నాలవ్యాపారికి చెప్పుకున్నాడు.

వ్యాపారి అంతా విని, "నాకు రత్నాల విలువ మాత్రమే తెలుస్తుంది; కవిత్వం విలువ తెలియదు. నీకు రాజదర్శనం ఇప్పించగలశక్తి నాకు లేదు. రాజభటులకు ఏ లంచమో ఇచ్చి మంచిచేసుకుని, రాజదర్శనం సంపాయించుకో అని చెప్పాడు.

ఆ మాటలకు ప్రసన్నుడు ఆవేశపడి ఆశువుగా ఒక పద్యం చెప్పాడు. ఆ పద్య భావం ఏమంటే—రాజభటులకు లంచం ఇచ్చిన కవుల కవిత్వం వినే రాజుకు, తన కవిత్వం వినిపించకపోవటమే మంచిదని.

రత్నాల వ్యాపారికి ఆ పద్యం అర్థం కాకపోయినా, అప్పుడే ఆ దుకాణంలో రత్నాలు కొనేందుకు అడుగుపెట్టిన దేవీదాసు విన్నాడు. ఆయన మహారాజు ఆస్థానకవి. ఆయన నోరువిప్పితే కవిత్వమే వెలువడుతుందని అందరూ చెప్పుకుంటారు. పండిత, పామరులను సరిసమానంగా రంజింపచేయగల దేవీదాసును, ఆ రాజ్యంలో అందరూ ఎంతగానో గౌరవిస్తారు.

దేవీదాసును చూస్తూనే రత్నాల వ్యాపారి సాదరంగా ఆహ్వానించాడు. దేవీదాసు, వ్యాపారికి తానెవరైందీ చెప్పవద్దన్నట్టు సైగచేసి, ప్రసన్నుడి వంక చూసి, "తమరు చూడబోతే మహాకవుల వలె వున్నారు. రాజదర్శనానికి తమరు

సాగారు. ప్రజల ఆలోచనల్లో మార్పు రావటం కోసం మహాసారుడు ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కాని, ఫలితం కలగలేదు.

అప్పుడు మహాసారుడి మంత్రి ఆయనతో, "ప్రభూ, మంచి వృత్తాలే ప్రజల ఆలోచనలను మార్చగలవు. పరమాత్మ ఒక్కరే అని వేదాలు ఘోషిస్తున్నవి. వేదాలను అందరూ గౌరవిస్తారు గదా! వేదసారాన్ని వ్యావహారిక భాషలో వివరించగలిగితే, ప్రజల ఆలోచనాధోరణిలో మార్పు వస్తుంది." అన్నాడు.

రాజు మహాసారుడికి, ఈ సలహా నచ్చింది. ఈ పని చేయటానికి దేవిదాసు మాత్రమే సమర్థుడని, ఆయనకు తోచింది. కాని, మంత్రి మాత్రం, "వేదసారాన్ని వ్యావహారిక భాషలో వివరించగలగటం ఒక్కరికి సాధ్యమయే పని కాదు. ప్రసన్నుడు కూడా దేవిదాసు అంతటి వాడని విన్నాను. మీరీ బాధ్యతను యిద్దరికీ అప్పగించండి," అని చెప్పాడు.

మహాసారుడు ఆ కవులిద్దరిని పిలిపించి, మంత్రి చెప్పినది వివరించాడు.

అందుకు ప్రసన్నుడు, "వేదసారాన్ని సామాన్యులకు అర్థమయ్యేలా చెప్పాలంటే, ముందు అది మనకు అర్థం కావాలి. అది ఒక్కరివల్లా, ఇద్దరివల్లా అయే పని కాదు. మహాపండితులతో చర్చలు జరిపి, ఆటుపైన కావ్యరచనకు పూనుకోవాలి," అన్నాడు.



దేవీదాసు మాత్రం, "ఈ విషయమై నాకు ఎవ్వరి సాయమూ అవసరంలేదు. నేనొక్కడినే, ఈ కావ్యాన్ని పూర్తి చేయగలను. నాకు రెండు మాసాల గడువు కావాలి," అని రాజును అడిగాడు.

మహారాజు వెంటనే ఆ కార్యభారాన్ని ఇద్దరు కవులకూ అప్పగించి, "ఎవరు కావ్యాన్ని ముందు పూర్తిచేస్తే, వారికి లక్ష వరహాల బహుమానం ఇస్తాను," అని చెప్పాడు.

వెంటనే కవులిద్దరూ తమ తమ ప్రయత్నాలు ప్రారంభించారు. దేవీదాసు సంస్కృతంలో మహాపండితుడు. ఎంతటి క్లిష్టతరమైన విషయమైనా, ఆయనకిట్టే అర్థమైపోతుంది. ఆ విధంగా ఆయన వేదాలను మననం చేసుకుని, వ్యావహారిక భాషలో కావ్యాన్ని తయారుచేయసాగాడు. అనుకున్న దానికంటే రెండు వారాల ముందే, దేవీదాసు కావ్యరచన ముగిసింది.

ప్రసన్నమూర్తికి సంస్కృతం అర్థమవుతుంది గాని, ఆ భాషలో ప్రావీణ్యంలేదు. అతను కొందరు వేదపండితులను ఆశ్రయించి, కావలసిన విషయాలన్నీ అర్థం చేసుకుని, కావ్యరచనకు ఉపక్రమించాడు. అందువల్ల అతనికి కావ్యం పూర్తి చేయడానికి రెండు మాసాలు పట్టింది.

దేవీదాసు ఎప్పటికప్పుడు, ప్రసన్నమూర్తి కావ్యరచన ఎలా సాగుతున్నదీ ఇతరుల ద్వారా తెలుసుకుంటూనే వున్నాడు.



బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, చిరంజీవి చేసిన నిర్ణయాన్ని, రాజా మహీపాలుడు అంగీకరించిన కారణంగా, మహాకవి, పండితుడూ అయిన దేవిదాసుకు తీరని అన్యాయం జరిగిపోయిందికదా! ఈ విషయంలో చిరంజీవి పక్షపాత బుద్ధికి అసలు కారణం ఏమిటి? అతడు దేవిదాసుకన్న తక్కువ ప్రతిభగల ప్రసన్నుణ్ణి ఎందుకు అభిమానించినట్టు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దేవిదాసు ఉత్తమ కవి అనటంలో సందేహంలేదు. కాని, ప్రసన్నుడు కూడా పోటీకి నిలిచిన కావ్యం ద్వారా అతడి స్థాయినందుకున్నాడు. అందువల్ల, యిప్పుడు యిద్దరూ సరిసమానులు. అలాంటప్పుడు బహుమతిని ఎవరికివ్వాలి? ఇద్దరు కవులనూ పరిశీలించిన మీదట ఒక సంగతి స్పష్టమవుతున్నది. దేవిదాసు తన ప్రతిభను పొగడుకోవడమే కాక, తనను మించిన కవి లేడని అహంకరిస్తున్నాడు. అది పతనానికి మొదటి! బహుమతి తనకు వచ్చి తీరాలన్న అతడి పట్టుదల చూస్తుంటే, అతడికి కీర్తి దాహంతోపాటు, ధనదాహం కూడా వున్నట్టు స్పష్టమవుతున్నది. అలాంటివాడు జీవితంలో దిగజారడం తప్ప, ఒక్క మెట్టు కూడా పైకిపోలేడు. ఇకపోతే, ప్రసన్నుడిలో యింకా వినయగుణం వున్నది. అంటే, అతడు యింకా కొత్త ఎత్తుల్ని చేరుకోగల అవకాశం వున్నది. సరిసమాన స్థాయిలో వున్న యిద్దరు కవులలో...పతనానికి సిద్ధంగా వున్న కవికిగాక, ఇంకా పైస్థాయికి పోగల కవికి బహుమానం యివ్వటం న్యాయం అనిపించుకుంటుంది. చిరంజీవి అదే చేశాడు. అతడిలో పక్షపాత బుద్ధి ఏమాత్రం లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# ఓర్వలేని స్వార్థం

ఒకానొక గ్రామంలో రామానందుడు, చంద్రకాంతుడు అని ఇద్దరు స్నేహితు లుండేవారు. వాళ్ళిద్దరూ చూసేవారికి, తోడబుట్టిన అన్నదమ్ముల్లా అన్యోన్యంగా వుండేవాళ్ళు. ఇద్దరిలో చంద్రకాంతుడు గొప్ప ధనవంతుల వంశం కలవాడు. పదిమందిలోనూ గొప్పలు చెప్పుకునేవాడు. రామానందుడు కొంత స్వభావుడే కాని, స్నేహితుని వ్యవహారా లలో జోక్యం చేసుకునేవాడు కాదు.

ఒక రోజున చంద్రకాంతుడి ఇంట్లో పెద్ద విందు జరిగింది. దానికి విశ్వంభరుడు అనే మరొక ధనవంతుడు వచ్చాడు. విశ్వంభరుడు ఎటువంటి వారికైనా సరే, ముందూ వెనకా ఆలోచించకుండా ఎంతటి మాట అయినా అనేయగలడని ప్రసిద్ధి. ఆయన ఏదో కబుర్లు చెబుతూ చంద్రకాంతుడి పక్కన చేరాడు.

ఈ సంగతి అక్కడే పని హడావిడిలో వున్న రామానందుడు చూడలేదు. ఇద్దరూ ధనవంతులే అని తెలిసిన రామానందుడు, వారిని ఎక్కువ సేపు మాట్లాడుకోనివ్వేవాడు కాదు.

విశ్వంభరుడు, చంద్రకాంతుడితో, "విందు వేడుకలు చాలా గొప్పగా చేస్తున్నావు. పంటలు బాగా పండాయా ఏమిటి?" అన్నాడు.

"అదేం కాదు. నా పంట పొలాల మీద ఎవరి పాపిష్టికళ్ళూ పడకూడదనే, వేడుకలు చేస్తున్నాను!" అన్నాడు చంద్రకాంతుడు.

ఈ జవాబు విశ్వంభరుడికి చురుక్కు మని తగిలింది. ఆయన ఒక క్షణం ఆగి, "కొందరి పాపిష్టికళ్ళు పడ్డాక, ఎన్ని విందులూ వేడుకలూ చేసినా, వాటి దుష్ట ప్రభావం పోదు. నా పంటలందుకే బాగా పండటం లేదు," అన్నాడు.

కొప్పలగడ్డ రామలక్ష్మి



అక్కడ చేరిన వారందరూ రామానందం యుక్తి మెచ్చుకున్నారు.

అప్పటి జగడం సద్దుమణిగిపోయింది. కాని, ఆనాటి నుంచి చంద్రకాంతుడు, రామానందుడితో మాట్లాడడం మానేశాడు. ఒకటి, రెండుసార్లు రామానందుడు మాట్లాడడానికి ప్రయత్నించినా, ఆయన ముఖం పక్కకు తిప్పుకునేవాడు.

తన స్నేహితుడి ప్రవర్తనలో వచ్చిన మార్పు అర్థం కాక, రామానందుడు, చంద్రకాంతుడి భార్యను చూసి, "ఏమమ్మా, వదినా! మా అన్నయ్య నన్ను చూడగానే ముఖం పక్కకు తిప్పేసుకుంటున్నాడు," అన్నాడు.

"ఆయనకు మీ మీద కోపం వచ్చింది. పదిమందిలో ఆయనను తప్పుపట్టి, నీతులు చెప్పారట. ఆ అవమానాన్ని, ఆయన జన్మలో మరిచిపోలేనంటున్నారాయన," అన్నది చంద్రకాంతుడి భార్య.

"ఎన్నో ఏళ్ళ నుంచి అన్నదమ్ముల్లాగా మసులుకున్నాం. నా మాటలు నచ్చక పోతే, ఆ విషయం నాతోనే చెప్పవచ్చు; నన్ను మందలించవచ్చు. కాని, స్నేహాన్ని ఇలా తెగతెంపులు చేసుకుంటాడా?" అన్నాడు రామానందుడు ఆశ్చర్యంగా.

"ఆయన తత్వం మీకు తెలియంది కాదుగదా! అక్కడికి వస్తున్నావని

"అంటే, నావి అంత పాపిష్టికళ్ళా బావా?" అన్నాడు చంద్రకాంతుడు కోపంగా.

"నేనేమీ అనలేదు. నువ్వే మొండిగా నావి పాపిష్టి కళ్ళన్నావు," అన్నాడు విశ్వంభరుడు.

దీనితో ఇద్దరిమధ్యా పెద్ద గొడవ మొదలైంది. వచ్చిన అతిథులందరూ వాళ్ళచుట్టూ చేరారు. రామానందుడు విషయం తెలుసుకుని, "చంద్రకాంతా! ఇది నీ ఇల్లు. నీ ఇంటికి వచ్చిన అతిథిని మర్యాద చేయడం, నీ బాధ్యత. ఇద్దరూ సరదాగా మాటామాటా అనుకున్నప్పుడు, సరదాగానే మర్చిపోవాలి," అన్నాడు.



"అంత దూరం నడవడం చాలా శ్రమతో కూడినపని. ఎక్కడా నీలో విసుగు పుట్టకూడదు. దారిలో ఎక్కడా విశ్రాంతి తీసుకోకూడదు. స్వామి దర్శనం అవగానే, తిరిగి కాలినడకన బయల్దేరి ఇక్కడికి రావాలి. తెలిసిందా?" అన్నాడు బైరాగి.

చంద్రకాంతుడు బైరాగి చెప్పినదానికి ఒప్పుకున్నాడు. ఆయన మందు పొట్లాం తీసుకుని శ్రీమల్లికార్జునుడి ఆలయానికి వెళ్ళాడు. తరవాత ఎక్కడా విశ్రాంతి తీసుకోకుండా, ఆ రాత్రికే తిరిగి వచ్చాడు.

బైరాగి చంద్రకాంతుణ్ణి చూసి ఆశ్చర్యంగా, "అప్పుడే తిరిగి వచ్చావా! ఇంతలోనే ఆలయం వరకూ వెళ్ళావా లేదా?" అని అడిగాడు.

"నా కొడుకును రక్షించుకునేందుకు త్వరగా వెళ్ళి, త్వరగా తిరిగి వచ్చాను," అన్నాడు చంద్రకాంతుడు.

"ఎక్కడా, ఎవరిమీదైనా విసుగు ప్రదర్శించలేదు కదా?" అన్నాడు బైరాగి.

"లేదు, స్వామీ! ఇక మందును మా వాడికివ్వవచ్చునా?" అని అడిగాడు చంద్రకాంతుడు.

"పిచ్చివాడా! ఈ మందు నీ కొడుక్కు పని చెయ్యదు. నీవు స్వార్థపరుడివి. ఆ స్వార్థం నిన్ను విడిచిపోయేవరకూ, నీ కొడుకును జబ్బు విడవదు." అన్నాడు బైరాగి గంభీరంగా.

"అదేమిటి, స్వామీ! నా కొడుకు కోసం రానూ పోనూ నాలుగామడల దూరం, ఒక్క రోజులో నడిచిన నేను స్వార్థపరుడినా? స్వార్థపరుడి కింత ఓర్పు సాధ్యమవుతుందా?" అన్నాడు చంద్రకాంతుడు.

"చూడు, నాయనా! భగవంతుడు కంటికి కనిపించడు. ఆలయంలో వుండేది శిలావిగ్రహం. నేను, నీకు అపరిచితుణ్ణి. మా ముగ్గుర్నీ నమ్మి, నువ్వు ఎంతో ఓర్పు ప్రదర్శించావు. అవునా?" అని అడిగాడు బైరాగి.



# మద్యపాన ఫలితం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్వుడు పండితవంశంగా ప్రసిద్ధిగాంచిన ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. ఆయన తనకు ఇరవైఏళ్ళ వయసు వచ్చేవరకూ సర్వ శాస్త్రాలూ చదివి, మహాపండితుడన్న ఖ్యాతి గాంచాడు.

ఆయనకు తల్లిదండ్రులు వివాహం చేయబోయారు. కాని, బోధిసత్వుడు అందుకు అంగీకరించక సన్యసించి హిమాలయ పర్వతాలకు పోయి, ఒక సుందర ప్రదేశంలో ఆశ్రమం నిర్మించుకుని ఉంటసాగాడు.

ఒకసారి బోధిసత్వుడు వానాకాలం నాలుగు నెలలూ శ్రావస్తిలో గడిపి, శిష్యులతో భద్రవతి అనే గ్రామం చేరాడు. అక్కడికి కొంచెందూరంలో ఒక నది, అంబ తీర్థమనే ప్రసిద్ధస్థలమూ వున్నవి. ఆయన ఆ తీర్థం కేసి శిష్యులతో బయలుదేరాడు. ఆ తీర్థం ఒడ్డున ఒక ముని ఆశ్రమమూ, ఆ ఆశ్రమంలో అంబతిత్థక అనే మహా విషసర్పమూ వున్నవి. అది తెలిసిన గ్రామవాసులు బోధిసత్వుడికి అక్కడికి వెళ్ళవద్దని సలహా ఇచ్చారు. ఆయన అది విని విననట్టు ఊరుకున్నారు.

ఆయన శిష్యుల్లో సాగతుడనే వాడొకడున్నాడు. అతడు మంత్రశాస్త్రంలో ఆరితేరినవాడే గాక, అసామాన్య ధైర్యశాలి. తతిమ్మావాళ్ళ నుంచి వేరుపడి ముని ఆశ్రమానికి వెళ్ళాడు.

ఆ సమయంలో ముని లేడు. సాగతుడు ఆశ్రమంలో ప్రవేశించి, ఒకచోట తుంగచాప పరుచుకుని కూర్చున్నాడు. ఆ వెంటనే మహా భయంకరాకారంలో వున్న విషసర్పం అతని ముందుకు వచ్చి బుస్సుమంటూ పడగవిప్పింది.

జాతకకథ

స్థవిరుడు ఇలాగు చెప్పుతుండగా పౌరులున్నారు. అప్పుడు శిష్యుల్లో ఒకడు, ''అయ్యలారా, మాకు పారావతమద్యం కావాలని తోస్తుంది. అది యింతవరకూ మాకు ఎక్కడా లభించలేదు. ఆ మద్యం తయారు చేసి పంపండి,'' అన్నారు.

నగరవాసులు అందుకు ఒప్పుకుని, మధ్యాహ్నం లోపల పారావతమద్యం తయారు చేసి, ఒక గృహస్థు ఇంట్లో దాచి, స్థవిరుణ్ణి వెంటబెట్టుకు పోయారు.

స్థవిరుడు పారావతమద్యం తాగటం ప్రారంభించి క్రమంగా కైపు తలకెక్కుతుంటే లేచి, పిచ్చివాడిలా మాట్లాడుతూ గంతులేస్తూ నగరద్వారం కేసి పరిగెత్తి, అక్కడ పడిపోయాడు. వెంట వున్న సహాధ్యాయులు అతణ్ణి భుజాల మీద వేసుకుని బోధిసత్వుడి దగ్గిరకు తెచ్చి, ఆయన పాదాలముందు తల వుండేలా పడుకోబెట్టారు.

అంతలో, స్థవిరుడు కోపంగా లేచి, బోధిసత్వుడి వైపుకు పాదాలు చాచి పడుకున్నాడు. బోధిసత్వుడు చిరునవ్వు నవ్వి, శిష్యులతో, ''ఆంబతీర్థంలో మహా విషసర్పాన్ని లొంగదీసినవాడితడే?'' అన్నాడు.

''స్థవిరుడు!'' అన్నారు వాళ్ళు.

''ఇప్పుడా స్థవిరుడు బురదపామునైనా లొంగతీయగలడా?'' అని బోధిసత్వుడు అడిగాడు.

''లొంగతీయలేడు,'' అన్నారు శిష్యులు.

అప్పుడు బోధిసత్వుడు, ''ఈ అనుభవాన్ని మరిచిపోకండి! మద్యపానం చేసేవారికి మైకమేగాదు, బుద్ధిభ్రమ కూడా కలిగిస్తుంది. ఈనాటి నుంచి ఎవరూ మద్యపానం చేయరాదని నియమం పెడుతున్నాను,'' అన్నాడు.

మద్యపాన మైకం నుంచి తేరుకున్నాక స్థవిరుడు బోధిసత్వుడి కాళ్ళ మీద పడి దుఃఖించసాగాడు. ఆయన వాణ్ణి లేవనెత్తి, మద్యపానం వల్ల కలిగే దుష్ఫలితాలు వివరించి చెప్పాడు.





# దోషం ఎవరిది?

కళింగదేశాన్ని మిహిరవర్మ పాలిస్తున్న రోజుల్లో. ఒకసారి ఎక్కడినుంచో నిర్మలానందుడనే యోగీశ్వరుడు రాజధాని నగరానికి వచ్చాడు. అతడు నగరం చేరిన కొద్ది రోజుల్లోనే, అతని మహిమలు బాగా ప్రచారమయాయి. ప్రజలు అతన్ని భగవదాంశ కలవాడని పూజించసాగారు.

నిర్మలానందుడి గొప్పతనం గురించి విన్న మిహిరవర్మకు, అయన్ని ఒకసారి దర్శించాలనే కోరిక కలిగింది. కాని, ప్రభుత్వచారుల్లో ఒకడు, నిర్మలానందుడు యోగిలా వేషం వేశాడనే సమాచారం అందించాడు. మిహిరవర్మ అతనిపై గట్టి నిఘా ఏర్పాటు చేశాడు. కొద్ది రోజుల్లోనే అతడు దొంగ యోగి అని తెలిసిపోయింది.

రాజు నిర్మలానందుణ్ణి, అతని శిష్యుల్ని సభకు రప్పించాడు. అయన సభలో నిర్మలానందుడి నేరాన్ని ప్రస్తావించగానే, అతడు రాజుకు సమస్తం తెలిసిపోయిందని గ్రహించాడు.

అయినా నిర్మలానందుడు ఏ మాత్రం తొణకక, "మహారాజా, మీరు నా గురించి చెప్పినదంతా యథార్థమే! అయితే, ఇందులో దోషం నాది కాదు. ఏది నిజమో, ఏది అబద్ధమో తెలుసుకోకుండా నమ్మిన ప్రజలది. మహామేధావులూ, ప్రజ్ఞావంతులూ కూడా నన్ను ఆశ్రయిస్తున్నారు. దేని కోసం? కోరికలు తీరడం కోసం!" అన్నాడు.

"అది అవకాశంగా తీసుకుని, నువ్వు అందర్నీ మోసగిస్తున్నావు." అన్నాడు మిహిరవర్మ కోపంగా.

"ఇందులో నేను చేసిన మోసం ఏమున్నది, మహారాజా! వాళ్ళు తమ కోర్కెలు తీర్చుకోవడానికి భగవంతుణ్ణి ప్రార్థించేకంటే, అడ్డదారులో వున్న

శ్రీమతి లక్ష్మీగాయత్రి

పరమానందం పొందగలరు. దీని పాటా-లాట్య ప్రదర్శనల ద్వారా ప్రజల నుంచి చాలా ధనం సంపాయించవచ్చు!

ఇలా ఆలోచించి భూపతి, కోయవాడితో బేరం ఆడి, దాన్ని ఎనిమిదివేల రూపాయలకు కొన్నాడు. అప్పటితడి దగ్గిర ఒక్క చిల్లిగవ్వ కూడా మిగలలేదు. అతడు తన గ్రామం చేరేందుకు బాడుగబండి కోసం ప్రయత్నం చేశాడు. కాని, అతణ్ణీ, వెంట ఉన్న మేకనూ చూసి బండివాళ్ళు, బాడుగలో ముందే సగం ఇవ్వాలని పట్టుపట్టారు.



భూపతికి ఏటూ పాలుపోలేదు. గ్రామంలో ఎవరికైనా డబ్బు అప్పు అడుగుదామనుకున్నాడు. అయితే, గ్రామంలో అందరికీ తన దగ్గిర చాలా పెద్ద మొత్తంలో డబ్బు వున్నట్టు తెలుసు. వాళ్ళకు ఆ డబ్బుతో పాటా, ఆటా నేర్చిన మేకను కొన్నానని చెప్పటం భూపతికి ఇష్టం లేదు.

ఇక చేసేదిలేక భూపతి, మేక మెడ తాడు పట్టుకుని లాగుతూ, కాలినడకన బయలుదేరాడు. అతడు ఆకలివల్లా, బడలికవల్లా నీరసించిపోయి గ్రామం చేరి, తండ్రితో, "ప్రపంచంలో మరెక్కడా లేని అద్భుతమైన మేకను కొనితెచ్చాను!" అన్నాడు.

ముకుందయ్య, "అలాగా!" అని మేక కేసి పరీక్షగా చూస్తూ, "రేపు విందుకు జమీందారునూ, దివానునూ కూడా ఆహ్వానించాను. మాంసం రుచి ఎలా వుంటుందో చూస్తేగాని, దీనవి అద్భుతం సంగతి తెలదు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే భూపతి బెంబేలుగా, "దీని మాంసం రుచా, నయం! దీన్ని కూరవండేందుకు కొని తేలేదు. దీని ద్వారా మనం లక్షలకు లక్షలు సంపాయించవచ్చు. రేపు అతిథులందర్నీ రానియ్యి. వాళ్ళు ఒక పరమాద్భుతం చూడబోతారు. ఆ తరవాత సంగతి రాజాగారి దాకా వెళుతుంది. ఆయన మన



# ఎదురుతిరిగింది

పూర్వం మిథిలాదేశాన్ని మంగళభాగ్యుడనే రాజు పాలిస్తూండేవాడు. అతడు మూర్ఖుడు, గర్వి, యుక్తాయుక్తాలూ, సాధ్యాసాధ్యాలూ ఆలోచించకుండా, ఏ క్షణంలో ఏది తోస్తే అది రాజాజ్ఞగా ప్రజల మీద ప్రయోగిస్తూ ఉండేవాడు.

ఒకనాడు మంగళభాగ్యుడు రాజప్రాసాదపు ఉపరిభాగాన చల్లగాలికి పచారు చేస్తూ, క్రింద రాజవీధిని నడుస్తూ వున్న ఆ సామాన్యజనాన్ని, వాళ్ళు ధరించిన రకరకాల దుస్తుల్నీ పరీక్షగా చూశాడు. వెంటనే అతనికో ఆలోచన తట్టింది. మంత్రిని పిలిపించాడు.

"మంత్రివర్యా!" అన్నాడు రాజు.

"ఏమి సెలవు, మహారాజా!" అన్నాడు మంత్రి.

"అదుగో, రాజవీధి వైపు చూడు! ప్రజలు ఎవరికి తోచిన విధంగా వాళ్ళు ప్రవర్తిస్తున్నట్టు కనబడుతున్నారు. ఇది సహించరాని విషయం. ధరించే దుస్తుల నుంచి, ప్రతి దాన్ని అందరు ప్రజలూ ఒకే విధంగా అనుసరించాలి. ఆహారం, మాట్లాడే భాష, కొలిచే దైవం, అన్నీ ఒకటిగానే ఉండాలి. ఇది మా ఆజ్ఞగా తక్షణం మన రాజ్యమంతటా చాటింపించు!" అన్నాడు.

వేషభాషల్లో, తిండితిప్పల్లో, భక్తి వైరాగ్య విషయాల్లో ప్రజలందరినీ ఒకే అచ్చులో తయారైన బొమ్మల్లా చేయటం, సాధ్యమయ్యేది కాదని మంత్రి రాజుకు మనవి చేశాడు. ఊహు! రాజాజ్ఞకు తిరుగు లేదన్నాడు మంగళభాగ్య మహారాజు.

రెండు మూడు రోజులు గడిచినై. తను మంత్రికి యిచ్చిన ఆజ్ఞలు సరిగా చాటింపు వేయించాడో లేదో, ప్రజలు వాటికి అక్షరశః ప్రవర్తిస్తున్నారో లేదో తెలుసుకోవాలనే కోర్కె మంగళభాగ్య

రాజుకు కలిగింది. తన పాలనలోని ప్రతి ఒక్కరూ ఆహార విహారాల నుంచి ప్రతి విషయంలో ఒకే పద్ధతిని, సాంప్రదాయాన్ని అలవరుచుకుని అలా ప్రవర్తించిన నాడు, ప్రపంచంలో తన పాలనకు ఒక విశిష్టమైన స్థానం ఆచంద్రార్కంగా వుండిపోగలదని అతడి కెంతో నమ్మిక కలిగింది.

ఒకనాటి ఉదయం మందభాగ్యుడు ఉద్యానవనానికి వెళ్ళాడు. అక్కడ అతనికి కనుపించిన దృశ్యం అతడి మనస్సును కలతపరచింది.

దాసదాసీలంతా ఒకేరకమైన దుస్తుల్లో వున్నారు. ఎవరు పురుషులో, ఎవరు స్త్రీలో కూడా తెలుసుకోవడం అసంభవమైపోయింది రాజుకు. అక్కడి నుంచి రాణివాసానికి వెళ్ళాడు. అక్కడా అదే పరిస్థితి. ఎవరు రాణులో, ఎవరు దాసీలో గుర్తుపట్టడం సాధ్యం కాలేదు. అందరూ ఒకే రకంగా దుస్తులూ, అలంకరణా చేసుకుని వున్నారు.

మందభాగ్యుడికి మతి పోయినట్లైయింది. మంత్రి మీద ఎక్కడలేని ఆగ్రహం కలిగింది. సరాసరి దర్బారుకు వెళ్ళాడు. అక్కడా అదే పరిస్థితి. మంత్రి ఎవరో, సేనానాయకుడెవరో, సేవకుడెవరో తెలుసుకోవడం కష్టమైంది. అందరిదీ ఒకే రకమైన వస్త్రధారణ.

"మంత్రీ!" అని గాండ్రించాడు రాజు.

"మంత్రీ!" అని తిరిగి గాండ్రించాడు మంత్రి.

"నేనా మంత్రిని? దుర్మార్గుడా!" అన్నాడు రాజు తీవ్రంగా. మంత్రి అదే మాటలను అంత తీవ్రంగా చిలకలా ఒప్పచెప్పాడు.

మందభాగ్యుడు తన అవివేకతకు ఎంతో సిగ్గుపడ్డాడు. మారు పలుక్కుండా తన భవనానికి తిరిగి వెళ్ళిపోయాడు. మరునాడు, ఎవరికి యిష్టమైన వస్త్రధారణ వారు అనుసరించవచ్చుని, యిష్టమైన దేవుణ్ణి కొలుచుకోవచ్చుని రాజాజ్ఞగా చాటింపు జరిగింది.





# శివపురాణం

మేనకా హిమవంతులు, తమ ఇంటికి తిరిగి పోయి సుఖంగా ఉన్నారు. కాల క్రమాన మేనక గర్భవతి అయి, అయిదు గ్రహాలు ఉచ్చదశలో ఉన్న సమయంలో మైనాకుడనే కొడుకును కన్నది. అతని తరవాత వరసగా మరి తొంభై తొమ్మిది మంది కొడుకులు కలిగారు. వారి తరవాత మేనక తిరిగి గర్భం దాల్చి, తొమ్మిది మాసాల పదిహేను రోజులకు, ఆర్ద్రా నక్షత్రం గల చైత్ర శుద్ధ నవమినాడు, పార్వతిని కన్నది. ఆ సమయంలో దిక్కులు వెలిగాయి. దేవతలు పుష్ప వృష్టి కురిపించారు. బ్రహ్మ, విష్ణువు, దేవేంద్రుడు మొదలైన వాళ్ళు పరదేవతను స్తోత్రం చేశారు.

పార్వతి పుట్టటం నీల కాంతి గల శరీరచ్ఛాయతోనూ, నాలుగు చేతులతోనూ, లలాట నేత్రంతోనూ కాళిక ఆకారంతో పుట్టింది. అది చూసి మేనక, ఆమెను మామూలు మానవ శిశువు రూపం ధరించమని ప్రార్థించింది. అప్పుడామె మామూలు శిశువుగా మారి ఏడవ నారంభించింది.

తనకు కుమార్తె కలిగిందన్న వార్త విని హిమవంతుడు పరమానంద భరితుడై, పురోహితులనూ, బ్రాహ్మణులనూ వెంట బెట్టుకుని పురిటింటికి వచ్చి, పచ్చ కర్పూరపు దీపాలు వెలిగింపజేసి, కస్తూరి జలం చల్లించి, నృత్యగానాలు ఏర్పాటు చేసి, బ్రాహ్మణుల చేత ఆశీర్వచనం చేయించి, వారికి ధనమూ, ధాన్యమూ,

1. పార్వతి జననం.



ఆ ప్రకారమే ఆ తల్లిదండ్రులు పార్వతిని శివుణ్ణి గురించి పట్టుదలతో తపస్సు చేయ నియమించారు.

తరవాత మేనకా హిమవంతులు పార్వతి సమేతులై శివుడు తపస్సు చేసుకుంటున్న కైలాసానికి వెళ్ళారు. ఆయన చుట్టూ గణాధిపతులు ఆయుధాలు ధరించి నిలిచి ఉన్నారు. కొందరు శివుడి పరిచర్యలు చూస్తున్నారు. హిమవంతుడు శివుడి సమీపానికి వెళ్ళటానికి రుద్ర గణాలవాళ్ళు అనుమతించారు.

హిమవంతుడు భార్యా సహితంగా శివుడికి సాష్టాంగ నమస్కారం చేసి, పూలూ చందనమూ మొదలైనవి సమర్పించింది. చేతులు జోడించుకుని నిలబడ్డారు. శివుడు కళ్ళు తెరిచి చూసి, "హిమవంతుడా, నువ్వు మహా పవిత్రుడవు. అందుచేతనే నీకు చెందిన ఈ కైలాస శిఖరాన తపస్సు చేసుకుంటున్నాను," అన్నాడు.

"మహాత్మా, నువ్వు ఇక్కడ తపస్సు చేసుకోవటం నా భాగ్యం. ఇక్కడ తపస్సు చేసుకుంటున్న నీకు ఎలాటి విఘ్నమూ కలగకుండా నేను చూస్తూనే ఉన్నాను," అన్నాడు హిమవంతుడు.

శివుడు సంతోషించి, హిమవంతుణ్ణి ఏదన్నా వరం కోరుకోమన్నాడు.

"నా కుమార్తె పార్వతి నీకు పరిచర్యలు చెయ్యటానికి ఉత్సాహపడుతున్నది. ఆమె అలా చేయటానికి అనుమతించు," అన్నాడు హిమవంతుడు.

"తపస్సు చేసుకునే వారికి స్త్రీల పరిచర్యలు తగవు. కావాలంటే నువ్వు వచ్చి పరిచర్యలు చేసి వెళుతూ ఉండు," అన్నాడు శివుడు.

"నా కుమార్తె కన్యక. మహాదేవి వరాన పుట్టింది. నీవంటి విరాగికి ఆమెవల్ల తపోభంగం ఎలా కలుగుతుంది? నా కోరికను మన్నించి, నా కుమార్తె పరిచర్యలు స్వీకరించు," అన్నాడు హిమవంతుడు. శివుడు సరే అన్నాడు.

సతీదేవి పోయాక శివుడు కైలాస పర్వతానికి వచ్చి తపస్సు ప్రారంభించిన తరవాత ఒకసారి శివుడి తపస్సు యొక్క వేడికి ఆయన నుదుటి నుంచి ఒక చెమట బిందువు భూమి మీద పడింది. అప్పుడా బిందువు నుంచి ఒక కుమారుడు పుట్టాడు. అతను అజానుబాహుడు, ఎర్రని శరీరచ్ఛాయ గలవాడు, స్థూలకాయుడు. భూదేవి ఆ కుమారుణ్ణి ఎత్తుకుని శివుడి వద్దకు తెచ్చి చూపింది.



శివుడు భూదేవిని చూసి, "నువ్వు ధన్యురాలవు. నా చెమట నుంచి పుట్టిన ఈ కుమారుడు భౌముడనే పేరుతో నీకు కీర్తి తెస్తాడు," అన్నాడు.

భౌముడు పెరిగి పెద్దవాడై, కాశీ పట్టణం చేరి, అక్కడ ఈశ్వరుణ్ణి గురించి ఘోరతపస్సు చేశాడు. ఈశ్వరుడు ప్రత్యక్షమై భౌముడికి గ్రహమండలంలో స్థానం కలిగించాడు. ఆ భౌముడికే కుజుడని, అంగారకుడని కూడా పేర్లు వచ్చాయి.

శివుడు తపస్సు చేసుకునే కాలంలోనే గంగ భూమికి అవతరించింది. భూలోకంలో నీరు లేదని జనములూ, పితృదేవతలూ మొరపెట్టుకోగా, బ్రహ్మ తన కమండలంలో నుంచి ఒక నీటి బిందువును వదిలాడు. అది మహా ప్రవాహమై భూమికేసి రాసాగింది. దానివల్ల భూలోకానికి కలిగే అపాయం గ్రహించి శివుడు ఆ ప్రవాహాన్ని తన జటాజూటంలో బంధించి, ఒక్క బొట్టును మానససరోవరంలోకి వదిలి, తిరిగి తపస్సు ప్రారంభించాడు.

ఈ సంగతి ఇలా ఉండగా, దక్షుడి కుమార్తెలలో ఒకతె అయి, కశ్యపుడి రెండవ భార్య అయిన దితి హిరణ్యకశిపుణ్ణి, హిరణ్యాక్షుణ్ణి కనటమూ, వాళ్ళు మహా బలవంతులూ, క్రూరులూ అయి లోకాలన్నిటినీ పీడించటమూ, విష్ణువు వరాహ, నారసింహావతారాలెత్తి వారిని చంపటమూ జరిగింది. పుత్రశోకంతో కుమిలిపోయే దితి కశ్యపుడి అనుగ్ర



హంతో మళ్ళీ గర్భం ధరించింది. తనకు మరొక ప్రబల విరోధి పుట్టబోతాడని భయపడి ఇంద్రుడు ఆమె గర్భంలోని పిండాన్ని తన వజ్రాయుధంతో ముక్కలు ముక్కలుగా నరికాడు. అయితే కశ్యపుడి అనుగ్రహం చేత పిండ ఖండాలు చావక, దితి కడుపున మరుత్తులుగా పుట్టి, ఇంద్రుణ్ణి సేవించటానికి వెళ్ళిపోయారు.

దితి నిరాశ చెంది తనకు పుత్రదానం చెయ్యమని కశ్యపుణ్ణి తిరిగి ప్రార్థించింది. బ్రహ్మను గురించి కొంతకాలం తపస్సు చెయ్యమని కశ్యపుడు ఆమెకు సలహా ఇచ్చాడు. దితి అలాగే చేసి, అనంతరం కశ్యపుడి అనుగ్రహంతో వజ్రకాయుడైన ఒక కొడుకును కన్నది. వాడి వజ్రకాయం చూసి తల్లిదండ్రులు వాడికి వజ్రాంగుడని పేరు పెట్టారు.

వజ్రకాయుడు పుట్టినప్పుడు ఉల్కాపాతాలూ, భూకంపాలూ, తుపానుగాలులూ కలిగాయి. దేవతలు భయపడ్డారు. దితి వజ్రాంగుణ్ణి చాలా గారాబంగా పెంచి పెద్దవాణ్ణి చేసి, "నాయనా, దేవతలు నాకు ఎంతో శోకం కలిగించారు. వాళ్ళు, నీ అన్నలైన హిరణ్యకశిపు, హిరణ్యాక్షులను విష్ణువు చేత చంపించారు. మరుత్తులు నా గర్భంలో ఉండగా ఇంద్రుడు నా గర్భాన్ని నరికాడు. నువ్వు దేవతల మీద యుద్ధం చేసి నా పగ తీర్చు," అన్నది.

తల్లి అలా అన్న మీదట వజ్రాంగుడు రాక్షస సేనలను చేర్చి, రణభేరి వేయించి, దేవేంద్రుడి పట్టణాన్ని ముట్టడించి, దేవతలను చావగొట్టి, దేవేంద్రుణ్ణి బందీగా తీసుకుని స్వర్గాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఈ వార్త విని పరమానంద భరితురాలయింది దితి.

దేవతలు బ్రహ్మ వద్దకు వెళ్ళి తమ అవమానాన్ని గురించి చెప్పుకున్నారు. బ్రహ్మ అంతా విని, కశ్యపుడితో సహా వజ్రాంగుడి వద్దకు వెళ్ళి, అతనికి మంచి మాటలు చెప్పి, ఇంద్రుణ్ణి విడిచి పుచ్చ

మని. స్వర్గాన్ని దేవతలకు తిరిగి ఇవ్వమని హితబోధ చేశాడు.

"నేను రాజ్యం కోసమూ, ధనం కోసమూ దేవతలతో యుద్ధం చెయ్యలేదు. ఈ దేవేంద్రుడు దుర్మార్గుడు. వీడు నా తల్లి మనసు క్షోభ పెట్టాడు. ఆమె గర్భాన్ని ఖండాలుగా కోశాడు. వీడు వదిలిపెట్ట దగినవాడు కాడు. అయినా మీరు చెప్పారు గనక విడిచిపెడుతున్నాను. వీడు నా తల్లిని క్షోభ పెట్టకపోతే ఇప్పుడు నా వల్ల క్షోభపడి ఉండడు," అన్నాడు వజ్రాంగుడు.

ఈ మాటకు బ్రహ్మ ఎంతో సంతోషించి, వజ్రాంగుణ్ణి వరం కోరుకోమన్నాడు.

"నాకు పరబ్రహ్మ స్వరూపమూ, భూతదయా తప్ప ఇంకేమీ అక్కర్లేదు. అవి రెండూ నాకు అనుగ్రహించండి," అన్నాడు వజ్రాంగుడు.

బ్రహ్మ మరింతగా సంతోషించి, వరాంగి అనే సౌందర్యవతి అయిన కన్యను వజ్రాంగుడికి భార్యగా ఇచ్చి వివాహం చేసి, కశ్యపుడు మొదలైన వారితో సహా వెళ్ళిపోయాడు. వజ్రాంగుడు కేవలభక్తుడై, సాత్విక స్వభావుడై, తన పట్టణానికి తిరిగి వచ్చి ఈశ్వరపూజ చేస్తూ జీవించసాగాడు.

కొంతకాలం గడిచింది. తన భార్య చేసే సేవలకు సంతోషించి వజ్రాంగుడు వరాంగితో, "నీకేం వరం కావాలో కోరు," అన్నాడు.

"మహా బలపరాక్రమవంతుడూ, దేవేంద్రుణ్ణీ, దేవతలనూ జయించగలవాడూ, ప్రపంచంలో తన కీర్తి శాశ్వతంగా నిలుపుకోగలవాడూ అయిన కొడుకు కావాలి," అన్నది వరాంగి.

భార్య ఇలా అనగానే వజ్రాంగుడు నొచ్చుకున్నాడు. వరాంగి స్త్రీ సహజమైన చపలచిత్తంతో దేవతా విరోధి అయిన కొడుకును కోరింది. అలాటివాణ్ణి విష్ణువు ఎంతోకాలం బతకనివ్వడు. అయితే వజ్రాంగుడికి మాట తప్పటం ఇష్టం లేదు. అందుచేత అతను బ్రహ్మను గురించి చాలా కాలం ఘోర తపస్సు చేశాడు.





ఒకప్పుడు వరసగా రెండు సంవత్సరాల పాటు, వానలు కురవనందున ఇస్ఫహాను పట్టణ వాసులూ, పరిసర ప్రాంతాలవాళ్ళూ, నీటి ఎద్దడివల్ల నానా అగచాట్ల పాలయ్యారు. మూడవ సంవత్సరంలో కూడా వర్ష ఋతువు గడిచిపోతున్నా, ఒక్క చినుకు వాన పడలేదు.

ఈ పరిస్థితుల్లో, ఒక రాత్రివేళ కొందరు భక్తులు మసీదు వద్ద చేరి, తలలు ఎత్తి ఆకాశం కేసి చూస్తూ, "దేవా, మా మీద దయచూపించు. అనావృష్టివల్ల, పంట పొలాలు సర్వనాశనమై పోవడమే గాక, తాగేందుకు నీరు కూడా లేక అలమటిస్తున్నాం. వర్షం కురిసేలా, కరుణించు!" అన్నారు.

ఈ విధంగా వాళ్ళు తెల్లవారేవరకూ ఎడతెగకుండా భక్తితో ప్రార్థనలు చేశారు. కాని, ఆకాశంలో చిన్న మబ్బుతునక కూడా కనిపించలేదు. కొంతసేపటికి అందరూ అలసిపోయి, అక్కడే నిద్ర పోయారు.

అయితే, ఆ భక్తుల్లో ఒక్కగానొక్కడు మేలుకొని వున్నాడు. అతడికి ఒక నల్లని యువకుడు, దాపులనున్న రాళ్ళ గుట్ట పైకి ఎక్కిపోతూండడం కనిపించింది. వాడేం చేయబోతున్నాడో అన్న కుతూహలం కొద్దీ భక్తుడు, అతడికేసి పరీక్షగా చూడసాగాడు.

యువకుడు కొద్ది నిమిషాలపాటు మౌనంగా ప్రార్థించి కూర్చుని, తరవాత తల పైకెత్తి ఆకాశం కేసి చూస్తూ, "ఓ, దేవా, కష్టాల్లో వున్న, యీ భక్తుల మొర ఎందుకాలకించవు? వాళ్ళ నీకు ప్రేమ వున్న సంగతి, నే ఎరుగుదును. త్వరగా వర్షం కురిపించమని నిన్ను వేడుకుంటు న్నాను." అన్నాడు.

ఆరేబియా కథ

ఉన్నారు. వాళ్ళు, బానిస వర్తకుడి దగ్గరకు పోయి, "యువకులైన బానిస ఎవరైనా అమ్మకానికున్నారా?" అని అడిగారు.

"ఒకళ్ళు కాదు, చాలామంది అమ్మకానికున్నారు," అంటూ వర్తకుడు, బానిసలను వాళ్ళ దగ్గిరకు తీసుకు వచ్చాడు.

బానిసలు ఇరవైమంది వరకూ ఉన్నారు. వాళ్ళల్లో ఎక్కువమంది యువకులు. భక్తులు వాళ్ళల్లో తమకు కావలసిన యువకుడి కోసం చూశారు. కాని కనిపించలేదు. వాళ్ళు నిరాశచెంది వెళ్ళిపోబోతున్నంతలో, ఒక గోడ మూలగా తల వంచుకు కూర్చున్న బానిస యువకుడు కనిపించాడు. రాత్రి వాణ్ణి చూసిన భక్తులు గుర్తించారు.

అతడు బానిస యువకుడి ముందుకు వెళ్ళగానే, బానిస వర్తకుడు వాణ్ణి లేవవలసిందిగా ఆజ్ఞాపించాడు.

"మేం అతణ్ణి కొనదలిచాం," అన్నారు భక్తులు.

బానిసవర్తకుడు వాళ్ళకేసి ఆశ్చర్యంగా చూసి, "నేను నిజాయితీ గల వర్తకుణ్ణి. మీరు కొనాలనుకుంటున్న వీడు వెర్రి వెధవ! మీరు పనిమంతుడైన బానిస కావాలనుకుంటే, అలాంటివాణ్ణి, వీళ్ళల్లో నుంచి మీకు అమ్మగలను," అన్నాడు.

"మాకు ఈ యువకుడినే కావాలి!" అన్నారు భక్తులు.



బానిస వర్తకుడు మారు మాట్లాడ కుండా, వాళ్ళని చాలా స్వల్పధరకు భక్తు లకు అమ్మాడు.

భక్తులు వాళ్ళని వెంటపెట్టుకుని వీధిలోకి వచ్చారు. బానిస యువకుడు తల వంచి చేతులు జోడించి, వాళ్ళతో, "యజమా నుల్లారా, మీ ఆజ్ఞ ఏమిటి?" అన్నాడు వినయంగా.

"నువ్వు మమ్మల్ని ఆజ్ఞాపించాలి, నువ్వే మా యజమానివి! నువ్వు దేవుడికి ప్రేమపాత్రుడివి. ఆ సంగతి మాకు తెలుసు," అన్నారు భక్తులు.

బానిస యువకుడు కుతూహలంగా వాళ్ళకేసి చూశాడు. రాత్రి, వాడితో మాట్లాడిన భక్తుడు ముందుకు వచ్చి, "నువ్వు, నన్ను గుర్తుపట్టలేదా? వర్షం కురిసేముందు, నువ్వు ప్రార్థన చేస్తున్న సమయంలో, నీతో మాట్లాడాను," అన్నాడు.

"అయ్యో!" అంటూ బానిస యువకుడు, అందరికేసి ఒకసారి చూసి "రాత్రి నేను స్మారకం తప్పి వున్నాను. తమరు దయవుంచి, నాకు మసీదులో ప్రార్థన చేసుకునేందుకు అనుమతి యిస్తారా?" అని అడిగాడు.

"తప్పకుండా! అప్పుడు, మేమంతా నీ సేవకులం," అన్నారు భక్తులు.

బానిస యువకుడు మసీదు లోపలికి పోయి, ఒకచోట ప్రణమిల్లి, "దేవా, నావల్ల నీకున్న ప్రేమరహస్యం కాస్తా బయటపడిపోయింది. ఇక నుంచి ప్రజలు నా చుట్టూ చేరి ఎక్కువలేని గౌరవ మర్యాదలూ చేస్తారు. నాకు యిక ముందు ఒంటరితనంలో కలిగే ఆనందం ఏమాత్రం లభ్యం కాదు. దేవా, కరుణించి నన్ను, నీ సన్నిధికి తీసుకుపోవా!" అని భక్తితో ప్రార్థించాడు.

ఆ తరవాత అతడు చాలాసేపు కదలా మెదలక వుండిపోయాడు. భక్తులు కొంత సేపు చూసి, ఎంతో భక్తి గౌరవాలతో అతణ్ణి తాకిచూశారు. బానిస యువకుడిలో జీవం లేదు.



మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జన...
సూపర్ రిన్‌తో తళతళలాడే
ఆ తెల్లదనం




సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు
మరే ఇతర డిటర్జెంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.

